# అథ చతుర్థో%ధ్యాయః

# ఋషభ చరిత్ర

నందీశ్వర ఉవాచ |

సనత్కుమార సర్వజ్ఞ చరితం శాంకరం ముదా | రుద్రేణ కథితం ప్రీత్యా బ్రహ్మణ    సుఖదం సదా || 1

నందీశ్వరుడిట్లు పలికెను -

ఓయీ! సనత్కుమారా! నీవు సర్వజ్ఞుడవు. నిత్యసుఖమునొసంగు శంకర చరితమును రుద్రుడు ప్రీతితో బ్రహ్మకు చెప్పియుండెను (1).

శివ ఉవాచ |

సప్తమే చైవ వారాహే కల్పే మన్వంతరాభిధే | కల్పేశ్వరో%థ భగవాన్ సర్వలోక ప్రకాశనః || 2

మనోర్వైవస్వతసై#్యవ తే ప్రపుత్రో భవిష్యతి | తదా చతుర్యుగాశ్చైవ తస్మిన్మన్వంతరే విధే || 3

అనుగ్రహార్థం లోకానాం బ్రాహ్మణానాం హితాయ చ | ఉత్పశ్యామి విధే బ్రహ్మన్ ద్వాపరాఖ్యయుగాంతికే || 4

యుగప్రవృత్త్యాచ తదా తస్మింశ్చ ప్రథమే యుగే | ద్వాపరే ప్రథమే బ్రహ్మన్ యదా వ్యాసస్స్వయం ప్రభుః || 5

తదాహం బ్రాహ్మణార్థాయ కలౌ తస్మిన్ యుగాంతికే | భవిష్యామి శివాయుక్త శ్శ్వేతో నామ మహామునిః || 6

హిమవచ్ఛిఖరే రమ్యే ఛాగలే పర్వతోత్తమే | తదా శిష్యాశ్శిఖాయుక్తా భవిష్యంతి విధే మమ || 7

శ్వేతశ్శ్వేతశిఖశ్చైవశ్వేతాశ్వశ్శ్వేతలోహితః | చత్వారో ధ్యానయోగాత్తే గమిష్యంతి పురం మమ || 8

శివుడిట్లు పలికెను-

వారాహకల్పమునందు ఏడవ మన్వంతరములో సర్వలోకములను ప్రకాశింపజేయు కల్పేశ్వరభగవానుడు వైవస్వత మనువు యొక్క పుత్రుడు, నీకు ప్రపౌత్రుడు కాగలడు. ఓ వీధీ! ఆ మన్వంతరములో మహాయుగములు కలవు గదా! (2, 3) ఓ విధీ! బ్రహ్మ ! నేను ద్వాపరయుగము నందు లోకానుగ్రహము కొరకు, బ్రాహ్మణుల హితము కొరకు జన్మించగలను (4). ఓ బ్రహ్మా! యుగముల వరుసననుసరించి, ప్రథమ మహాయుగములో మొదటి ద్వాపరయుగములో విష్ణుప్రభుడు వ్యాసుడై జన్మించగలడు (5). అపుడు ద్వాపరము అంతమై కలి ప్రవేశించగానే నేను బ్రాహ్మణుల కొరకై పార్వతీదేవితో గూడి శ్వేతమహామునిగా అవతరించ గలను (6). అపుడు సుందరమగు హిమవచ్ఛిఖరమునందు ఛాగలమను పర్వతరాజమునందు నా శిష్యులు శిఖను ధరించి ఉద్భవించగలరు. ఓ విధీ! (7) శ్వేతుడు, శ్వేతశిఖుడు, శ్వేతాశ్వుడు, శ్వేతలోహితుడు అనునవి వారి పేర్లు. వారు నలుగురు ధ్యానయోగ ప్రభావముచే నా పురమును పొందగలరు (8).

తతో భక్తా భవిష్యంతి జ్ఞాత్వా మాం తత్త్వతో%వ్యయమ్ |
జన్మమృత్యు జరాహీనాః పరబ్రహ్మ సమాధయః || 9

ద్రష్టుం శక్యో నరైర్నాహం ఋతే ధ్యానాత్పితామహ |
దానధర్మాదిభిర్వత్స సాధనైః కర్మహేతుభిః || 10

ద్వితీయే ద్వాపరే వ్యాస స్సత్యో నామ ప్రజాపతిః | తదా తదా
భవిష్యామి సుతారో నామతః కలౌ || 11

తత్రాపి మే భవిష్యంతి శిష్యా వేదవిదో ద్విజాః |
దుందుభిశ్శతరూపశ్చ హృషీకః కేతుమాంస్తథా || 12

చత్వారోధ్యానయోగాత్తే గమిష్యంతి పురం మమ | తతో ముక్తా
భవిష్యంతి జ్ఞాత్వా మాం తత్త్వతో%వ్యయమ్ || 13

తృతీయే ద్వాపరే చైవ యదా వ్యాసస్తు భార్గవః | తదాప్యహం
భవిష్యామి దమనస్తు పురాంతికే || 14

తత్రాపి చ భవిష్యంతి చత్వారో మమ పుత్రకాః | విశోకశ్చ విశేషశ్చ విపాపః పాపనాశనః || 15

శిష్యై#్యస్సాహాయ్యం వ్యాసస్య కరిష్యే చతురానన | నివృత్తిమార్గం సుదృఢం వర్తయిష్యే కలావిహ || 16

తరువాత వారు అవ్యయుడనగు నా స్వరూపమునెరింగి భక్తులు కాగలరు. వారు జన్మ మరణములనుండి, వార్ధక్యము నుండి విముక్తిని పొంది పరబ్రహ్మ సమాధి యందు ఉండెదరు (9). ఓ పితామహా ! వత్సా! ధ్యానము లేకుండగా, మానవులు దాన ధర్మాది కర్మప్రధానమగు సాధనములచే నన్ను దర్శింపజాలరు (10). రెండవ ద్వాపరయుగమునందు సత్యప్రజాపతి వ్యాసుడై అవతరించగలడు. ఆ తరువాతి కలియుగములో నేను సుతారుడను పేరుతో అవతరించగలను (11). ఆ అవతారమునందు కూడ దుందుభి, శతరూపుడు, హృషీకుడు, కేతుమాన్ అను వేదవేత్తలగు బ్రాహ్మణులు నాకు శిష్యులు కాగలరు (12). ఆ నలుగురు ధ్యానయోగముచే నా పురమును పొంది, తరువాత అవ్యయుడనగు నా స్వరూపమునెరింగి మోక్షమును పొందగలరు (13). మూడవ ద్వాపరయుగములో భార్గవుడు వ్యాసుడు కాగలడు. అపుడు కూడా నేను నా నగరమునకు సమీపములో దమనుడను పేర అవతరించగలను (14). ఆ అవతారమునందు కూడా నాకు విశోకుడు, విశేషుడు, విపాపుడు, పాపనాశనుడు అను నల్గురు కుమారులు ఉండగలరు (15). హే చతుర్ముఖా! నేను శిష్యులతో గూడి వ్యాసునకు సహకరించెదను. ఇహలోకములో కలియుగమునందు జ్ఞానమార్గమును మిక్కిలి దృఢముగా ప్రవర్తిల్ల జేసెదను (16).

చతుర్థే ద్వాపరే చైవ యదా వ్యాసో%ంగిరాస్స్మృతః | తదాప్యహం భవిష్యామి సుహోత్రో నామ నామతః || 17

తత్రాపి మమ తే పుత్రా శ్చత్వారో యోగసాధకాః | భవిష్యంతి మహాత్మానస్తన్నామాని బ్రువే విధే || 18

సుముఖో దుర్ముఖశ్చైవ దుదర్భో దురతిక్రమః |
శిష్యైశ్చైసాహాయ్యం వ్యాసస్య కరిష్యేఽహం తదా విధే || 19

పంచమే ద్వాపరే చైవ వ్యాసస్తు సవితా స్మృతః | తదా యోగీ
భవిష్యామి కంకో నామ మహాతపాః || 20

తత్రాపి మమ తే పుత్రాశ్చత్వారో యోగసాధకాః | భవిష్యంతి
మహాత్మానస్తన్నామాని శృణుష్వ మే || 21

సనకస్సనాతనశ్చైవ ప్రభుర్యశ్చ సనందనః |
విభుస్సనత్కుమారశ్చ నిర్మలో నిరహంకృతిః || 22

తత్రాపి కంకనామాహం సాహాయ్యం సవితుర్విధే | వ్యాసస్య హి
కరిష్యామి నివృత్తి పథవర్ధకః || 23

నాల్గవ ద్వాపరయుగములో అంగిరసుడు వ్యాసుడనబడును. అపుడు కూడ నేను సుహోత్రుడను పేరుతో అవతరించగలను (17). ఆ అవతారములో కూడా నాకు యోగసాధకులగు నల్గురు పుత్రులు కలిగెదరు. ఓ విధీ! మహాత్ములగు వారి పేర్లను చెప్పెదను (18). సుముఖుడు, దుర్ముఖుడు, దుదర్భుడు, దురతిక్రముడు అనునవి వారి పేర్లు. ఓ విధీ! అపుడు నేను శిష్యులతో గూడ వ్యాసునకు సహకరించగలను (19). అయిదవ ద్వాపరములో వ్యాసునకు సవిత అని పేరు. అపుడు నేను మహాతపశ్శాలియగు కంకుడను యోగినై అవతరించెదను (20). ఆ అవతారములో కూడ నాకు యోగ సాధకులు, మహాత్ములు అగు నల్గురు పుత్రులు ఉండ గలరు. వారి నామములను చెప్పెదను. వినుము (21). సనకుడు, సనాతనుడు, సనందనుడు, సనత్కుమారుడు అనునవి వారి పేర్లు. సనందనుడు గొప్ప సమర్థుడు. సనత్కుమారుడు సర్వవ్యాపకుడు, దోషరహితుడు మరియు అహంకారము లేని వాడు (22). ఓ బ్రహ్మ! ఆ అవతారములో కూడ కంకుడను పేరు గల నేను సవిత యను వ్యాసునకు సహకరించి జ్ఞానమార్గమును అభివృద్ధి చేసెదను (23).

పరివృత్తే పునష్షష్ఠే ద్వాపరే లోకకారకః | కర్తా వేదవిభాగస్య
మృత్యుర్వ్యాసో భవిష్యతి || 24

తదాప్యహం భవిష్యామి లోకాక్షిర్నామ నామతః | వ్యాసస్య సుసాహాయ్యార్థం నివృత్తి పథవర్ధనః || 25

తత్రాపి శిష్యాశ్చత్వారో భవిష్యంతి దృఢవ్రతాః | సుధామా విరజాశ్చైవ సంజయో విజయస్తథా || 26

సప్తమే పరివర్తే తు యదా వ్యాస శ్శతక్రతుః | తదాప్యహం భవిష్యామి జైగీషవ్యో విభుర్విధే || 27

యోగం సందృఢయిష్యామి మహాయోగ విచక్షణః | కాశ్యాం గుహాంతరే సంస్థో దివ్య దేశే కుశాస్తరి ః || 28

సాహాయ్యం చ కరిష్యామి వ్యాసస్య హి శతక్రతోః | ఉద్ధరిష్యామి భక్తాంశ్చ సంసారభయతో విధే || 29

తత్రాపి మమ చత్వారో భవిష్యంతి సుతా యుగే | సారస్వతశ్చ యోగీశోమేఘవాహస్సువాహనః || 30

మరల ఆరవ ద్వాపరయుగము ఆరంభము కాగానే లోకనియామకుడగు మృత్యువు వ్యాసునిగా అవతరించి వేదవిభాగమును చేయగలడు (24). అప్పుడు కూడా నేను లోకాక్షియను పేరుతో అవతరించి వ్యాసునకు చక్కగా సాహాయ్యమునందించి జ్ఞానమార్గమును వృద్ధి చేయగలను (25). ఆ అవతారములో గూడా నాకు దృఢమగు వ్రతముగల నల్గురు శిష్యులు ఉండగలరు. సుధామ, విరజసుడు, సంజయుడు, విజయుడు అనునవి వారి పేర్లు (26). ఏడవ ద్వాపరయుగము ఆరంభము కాగానే శతక్రతువు అను వ్యాసుడు అవతరించును హే విధీ! అప్పుడు సర్వవ్యాపకుడనగు నేను జైగీషవ్యుడు అను పేర అవతరించగలను (27). ఆ అవతారములో మహాయోగేశ్వరుడనగు నేను దివ్య దేశమగు కాశీనగరములో గుహ లోపలి దర్భాసనముపై ఆసీనుడనై యోగమును దృఢము చేసెదను (28). మరియు శతక్రతుడను వ్యాసునకు సాహాయ్యమును చేసెదను. ఓ బ్రహ్మా! భక్తులకు సంసారభయమునుండి రక్షణను కల్పించెదను (29). ఆ

యుగము నందు కూడ నాకు నల్గురు కుమారులు ఉండగలరు. సారస్వతుడు, యోగీశుడు, మేఘవాహుడు, సువాహనుడు అనునవి వారి పేర్లు (30).

అష్టమే పరివర్తే హి వసిష్ఠో మునిసత్తమః | కర్తా వేదవిభాగస్య వేదవ్యాసో భవిష్యతి || 31

తత్రాప్యహం భవిష్యామి నామతో దధివాహనః | వ్యాసస్య హి కరిష్యామి సాహాయ్యం యోగవిత్తమః || 32

కపిలశ్చాసురిః పంచశిఖశ్శాల్వలపూర్వకః | చత్వారో యోగినః పుత్రా భవిష్యంతి సమా మమ || 33

నవమే పరివర్తే తు తస్మిన్నేవ యుగే విధే | భవిష్యతి మునిశ్రేష్ఠో వ్యాసస్సారస్వతాహ్వయః || 34

వ్యాసస్య ధ్యాయతస్తస్య నివృత్తి పథ వృద్ధయే | తదాప్యహం భవిష్యామి ఋషభో నామతస్స్మృతః || 35

పరాశరశ్చ గర్గశ్చ భార్గవో గిరిశస్తథా | చత్వారస్తత్ర శిష్యా మే భవిష్యంతి సుయోగినః || 36

త్రైస్సాకం ద్రఢయిష్యామి యోగమార్గం ప్రజాపతే | కరిష్యామి సాహాయ్యం వై వేదవ్యాసస్య సన్మునేః || 37

ఎనిమిదవ ద్వాపరము ఆరంభ##మైన పిదప వసిష్ఠ మహర్షి వేదవిభాగమును చేసి వేదవ్యాసుడు కాగలడు (31). ఆ సమయమునందు కూడా నేను దధివాహనుడను పేరుతో అవతరించి యోగవేత్తలలో శ్రేష్ఠుడనై వ్యాసునకు సాహాయ్యమును చేయగలను (32). నాకు నాతో సమమగు యోగులు అయిన నల్గురు పుత్రులు ఉండగలరు. కపిలుడు, ఆసురి, పంచశిఖుడు, శాల్వల పూర్వకుడు అనునవి వారి పేర్లు (33). తొమ్మిదవ ద్వాపరయుగములో సారస్వతుడను మహర్షి వ్యాసుడుగా అవతరించగలడు (34). ఓ బ్రహ్మా! ఆ వ్యాసుడు జ్ఞానమార్గ వృద్ధి కొరకు చింతిల్లుచుండగా, నేను ఆ యుగమునందు కూడా

ఋషభుడను పేరుతో అవతరించగలను (35). గొప్ప యోగినగు నాకు ఆ అవతారములో పరాశరుడు, గర్గుడు, భార్గవుడు, గిరిశుడు అను నల్గురు శిష్యులు ఉండగలరు (36). ఓ ప్రజాపతీ! నేను వారితో కలిసి యోగమార్గమును దృఢము చేసెదను. మరియు వేదవ్యాస మహర్షికి సాహాయ్యమును చేయగలను (37).

తేన రూపేణ భక్తానాం బహునాం దుఃఖినాం విధే | ఉద్ధారం భవతోఽహంవై కరిష్యామి దయాకరః || 38

సోఽవతారో విధే మే హి ఋషభాఖ్యస్సుయోగకృత్ | సారస్వతవ్యాసమనః పర్తా నానోతికారకః || 39

అవతారేణ మే యేన భద్రాయుర్నృపబాలకః | జీవితో హి మృతః క్ష్వేడదోషతో జనకోజ్ఝితః || 40

ప్రాప్తేఽథ షోడశే వర్షే తస్య రాజశిశోః పునః | య¸° తద్వేశ్మ సహసా ఋషభస్స మదాత్మకః || 41

పూజితస్తేన స ముని స్సద్రూపశ్చ కృపానిధిః | ఉపాదిదేశ తద్ధర్మాన్ రాజయోగ్యాన్ ప్రజాపతే || 42

తతస్స కవచం దివ్యం శంఖం ఖడ్గం చ భాస్వరమ్ | దదౌ తస్మై#్మ ప్రసన్నాత్మా సర్వశత్రు వినాశనమ్ || 43

తదంగభస్మనామృశ్య కృపయా దీనవత్సలః | స ద్వాదశసహస్రస్య గజానాం చ బలం దదౌ || 44

ఓ బ్రహ్మ! దయానిధినగు నేను ఆ రూపముతో దుఃఖమును పొందియున్న అనేక మంది భక్తులను, మరియు నిన్ను ఉద్ధరించగలను (38). ఓ విధీ! నేను ఆ ఋషభావతారములో గొప్ప యోగమార్గమును ప్రవర్తిల్ల జేసి, సారస్వతవ్యాసుని మనస్సునకు ఆనందమును కలిగించి అనేకలీలలను ప్రకటించగలను (39). ఆ అవతారములో విషదోషము వలన మరణించి తండ్రిచే పరిత్యజింపబడిన భద్రాయువను రాజకుమారుని నేను జీవింపజేసెదను (40). ఆ రాజకుమారుడు పదహారు

సంవత్సరముల యువకుడు కాగానే, ఋషభ రూపములో నున్న నేను వెంటనే ఆతని గృహమునకు వెళ్లెదను (41). ఓ ప్రజాపతీ! పరమేశ్వరస్వరూపుడు, దయానిధి యగు ఆ ముని వానిచే పూజింపబడినవాడై రాజునకు యోగ్యమైన ధర్మములను ఉపదేశించును (42). తరువాత ప్రసన్నమగు అంతఃకరణముగల ఆ ఋషభుడు కవచమును దివ్యశంఖమును, ప్రకాశించే కత్తిని ఆతనికి ఇచ్చెను. ఆ కత్తి శత్రువులనందరినీ సంహరించగల్గును (43). మరియు దీనవత్సలుడగు ఆ ఋషభుడు దయతో ఆ రాజకుమారుని శరీరమును భస్మతో లేపనము చేసి పన్నెండు వేల ఏనుగుల బలమును ఇచ్చెను (44).

ఇతి భద్రాయుషం సమ్యగనుశ్వాస్య సమాతృకమ్ | య¸ం
సై#్వరగతస్తాభ్యాం పూజితో ఋషభః ప్రభుః || 45

భద్రాయురపి రాజర్షిర్జిత్వా రిపుగణాన్ విధే | రాజ్యం చకార ధర్మేణ
వివాహ్య కీర్తిమాలినీమ్ || 46

ఇత్థం ప్రభావ ఋషభో%వతార శ్శంకరస్య మే | సతాం
గతిర్దీనబంధుర్నవమః కథితస్తవ || 47

ఋషభస్య చరిత్రం హి పరమం పావనం మహత్ | స్వర్గ్యం
యశస్యమాయుష్యం శ్రోతవ్యం చ ప్రయత్నతః || 48

ఇతి శ్రీ శివమహాపురాణ  శతరుద్ర సంహితాయాం ఋషభ చరిత్ర
వర్ణనం నామ చతుర్థో%ధ్యాయః (4)

ఆ ఋషభయోగీంద్రుడు ఈ తీరున భద్రాయుషుని, ఆతని తల్లిని సంతోషపెట్టి వారిచే పూజింపబడినవాడై యథేచ్ఛగా వెళ్లెను (45). ఓ విధీ! రాజర్షియగు భద్రాయువు శత్రు మూకలను నిర్జించి కీర్తిమాలిని అను యువతిని వివాహమాడి ధర్మబద్ధముగా రాజ్యము నేలెను (46). శంకరుడనగు నా తొమ్మిదవ అవతారము, సత్పురుషులకు గతి, దీనులకు బంధువు అగు ఋషభుని మహిమను నీకు చెప్పితిని (47). ఋషభుని చరిత్ర

పరమపావనమైనది, గొప్పది, స్వర్గమును యశస్సును ఆయుర్దాయమును ఇచ్చునది గాన దానిని ప్రయత్న పూర్వకముగా వినవలెను (48).

శ్రీ శివమహాపురాణములోని శతరుద్రసంహితయందు ఋషభచరిత్రవర్ణనమను నాల్గవ అధ్యాయము ముగిసినది (4).